సంపుటము 5] నవంబరు, 1918 [సంచిక 5

# బాలమిత్ర



## మూడు బంగారు చేపలు

అనగనగ ఒక ఊరు. ఆ ఊళ్లో ఒకాయన. ఆయనకు మూడు చిన్న చేపలు. ఆ చేపలు బంగారపువి. వాటంతమంచివి మరెక్కడా లేవు. ఆ మూడు చేపలను ఆయన ఒక చిన్న గుంటలో వదలెను.

ఆ గుంటకు నీరు ఒక పెద్ద చెరువునుండి వచ్చేది. నీరురావడానికి ఒక తూమున్నది.

ఆయన ప్రతిరోజు అన్నపు మెతుకులు తీసుకపోయి వాటికని నీళ్లవేసేవాడు. వేయగానే ఆ చేపలువచ్చి వేసినవాటిని తినేవి.

ఇట్లా చాలకాలము జరిగెను.

ఒకనాడాయన ఆ చిన్నిముద్దు బంగారు చేపలనుచూచి, "ఓ చిన్ని చేపలారా! ఓ కన్నిపండులారా! మీ కొక్కమంచి మాట నేను చెప్పతాను వినుడి. మీకు తొందర లేకుండ -గోరినయెడల, ఆ తూము గుండా చెరువులోనికి పోకుడు.

నేను లేనప్పుడు ఎప్పుడైనను గట్టుమీదకు రాకుడు." అని చెప్పెను.

గాని చేపలాయన చెప్పినది గ్రహింపలేదు. గనుక అతడు "అయ్యో! ఎంత చెప్పినా తెలియలేదే" అని ఆ తూమువైపు బోయి ఆ చేపలు దానిలోకి వెళ్లబోయినప్పుడెల్లను నీళ్లను కర్రతో గొట్టి వాటిని బెదరించెను. గట్టుమీదకు వచ్చుటకు ప్రయత్నించినప్పుడును అతడు వాటిని బెదరించెను.

ఇట్లు చాలకాలము చేసినపిదప, వానికిక తెలిసినదని అతడు మానివేసెను. అయితే ఆ చేపలు వాని పనులు జూచి నప్పుడు చాల ఆశ్చర్యపడినవి. తమ యెడల అంతదయగా నుండు వాడేల ఇట్లు చేయుచున్నాడో వానికి తోచలేదు. వాటిలోనొకటి "ఈయనెంత చెడ్డవాడు! ప్రొద్దాక నీటిలో నెవరుందురు. ఖైదులో పెట్టినట్లున్నది. నే నిక్కడుండను. వెళ్లి పోయెదను" అనెను.

అందుకు రెండవది. "ఔను, నాకుకూడ కష్టముగానున్నది బైట ఎంత మనోహరముగానున్నది. చక్కని ఎండ, చక్కని పచ్చిక, చక్కని పువ్వులు చూడడానికి వీలుగాకుండ ఉన్నది. నేను కూడ వెళ్లెదను." అని జవాబిచ్చెను.

గాని మూడవది మాత్రము "అయ్యో! మన యజమానుడు మనలను ఎక్కడికి బోనియ్యక యిక్కడనే ఉంచినది

మన మేలు కొరకే అనుకొంటాను. గనుక నేనురాను" అని పలికెను.

కొంచెము సేపటికి మొదటి చేప తూముగుండా చెరువు జేరెను. వెంటనే ఒక పెద్దచేపవచ్చి దానిని మ్రింగివేసెను. రెండవది ఎగిరి గట్టుమీదబడెను. అక్కడ గాలిపీల్చుకొనలేక కొన్ని నిమిషములలో ప్రాణము విడిచెను. మూడవచేప మాత్రము అందులోనే ఉండి పెరిగి పెద్దదాయెను.

---

## కీర్తన

యేసుని ప్రేమయెంతో గొప్పది
చూడ నోల్లనిది యాధరలలో || యేసు ||

2. యేసుని ప్రేమచావుకు సిద్ధం
యేసుని ప్రేమచూడ నోల్లనిది || యేసు ||

3. యేసుడు చచ్చెన్ మానవుల కొరకు
యేసుడు మృతినొంద పాపులకొరకు || యేసు ||

4. యేసుని ప్రేమన్ చాటూచుండుము
యేసుని ప్రేమకు సంతోషపడు. || యేసు ||

ఈ కీర్తన 10 సంవత్సరములుగల పిల్లచే కవిచేయ బడెను.

ఎన్. హా. జే

# నీ నోటిలో యేమున్నది?

ఒకానొకయూరిలో ఒక తల్లియు తండ్రియు కలరు. వారికి ఒక మారుటి బిడ్డయు ఒకసొంత బిడ్డయు కలరు. మారుటిబిడ్డ పేరు బంగారమ్మ. సొంతబిడ్డ మాయమ్మ. ఈ మారుతల్లి బంగారమ్మను చాలా కష్టపెట్టుచున్నది. మరికొంత కాలమునకు ఈ పిల్లకు పెండ్లిచేసిరి. పాప మా పిల్ల కొద్దిదినములలో విధవయై దుఃఖములో మునిగిపోయెను. ఈ తల్లిదండ్రి ఈ పిల్లను అత్తవారి ఇంటినుండి వారి ఇంటియొద్దకు తీసుకొని వచ్చిరి. ఈ పిల్ల చాలా మంచిపిల్ల ఈ మారుతల్లి ఈమెను బానిస దానివలె ఇంటిపని యావత్తు చేయించుచు మంచినీళ్లు మాడు చెక్కలు వేయుచు కష్టపెట్టుచున్నది. అయినను ఈ పిల్ల సుగుణములు గలదైనందున యేమియు సణగక గొణగక ఆ పనిచేయుచుండును, గాని సొంత బిడ్డయగు మాయ నొక రాణివలె ఈమె పై అధికారముచేయుచు ఒకపనియైన చేయుక ఎల్లప్పుడు మంచిబట్టలువేయుచు మంచి భోజనము తింటు, సమస్త సుఖములనుభవించుచుండెను. ఈ రీతిగా జరుగుచుండెను. ఒకనాడు బంగారమ్మ నీళ్లుమెస్తుపడినందున పాపము ఒక కాలుబెనికి చాలానొప్పి కలిగించెను. ఆమె చాలా బాధపడుచు తనచెల్లియైన మాయను దగ్గరకు పిలిచి,

చెల్లి! ఈ దినము నాకు చాలానొప్పిగా నున్నది. బావికినడువ లేనంతటి స్థితిలో యున్నాను. గనుక ఇంటిలో పనియావత్తు నేనే చేస్తాను. మీరు బావికివెళ్లి రెండుబిందెలునీళ్లు పట్టుకొని రా యని చెప్పగా ఈపిల్ల చాలా కోపపడి నీవు దాసీవి. నీవే తేవలసినది. నన్నునీళ్లు తెమ్మంటావా? నీ కెంతగర్వము. అని తిట్టి కోపపడి, తల్లితోకూడ చెప్పి తిట్టించెను. ఈ బంగారమ్మ యేమియు అనక వినయముతో బిందెపట్టుకొని మారుమాటచెప్పక బయలుదేరి బావికివెళ్లెను. ఇంతలో బావికడకు ఒక ముసలమ్మ నిండుముసుకు వేసుకొని చెంబుచేత బూని ఈ పిల్లయొద్దకుబోయి అమ్మాయి! నాకు దప్పికగుచున్నది. నీళ్లుపోసెదవా యని అడిగెను. ఆ పిల్ల మరియాదతో అమ్మా పోసెదను అనిచెప్పి ఆ నొప్పితోనే నీళ్లుచేది చెంబులోపోయుగా ఆ చెంబుక్రింద జారవిడిచి మళ్లిపోయుమనెను, ఈ పిల్లతిరిగి నీళ్లుపోసెను. ఈ ముసలమ్మ మరల క్రింద పారబోసి పిల్లా! నీవెంత చెడ్డపిల్లవు, వయ్యారముతో పోస్తావెందుకు జాగ్రత్తగా ముందుచూచి పోయుము అని చెప్పెను. ఆ పిల్లయేమియు గొణగక వినయముతో అమ్మా మీరు చెంబుగట్టిగా పట్టుకొనినట్లైన క్రిందపడదు యని చెప్పెను.

ఆ ముసలమ్మ ఏమియు చెప్పక నీళ్లు త్రాగి కూర్చుండి, ఈ పిల్లతో అమ్మాయీ ఈ గడ్డిలో నా కాలిచెప్పు పోయినది వెతికి తెచ్చి పెట్టుమని చెప్పగానే ఆమె యేమి చెప్పక ఈ చెప్పు తెచ్చి ముసలమ్మకివ్వగా క్షణమాత్రములో ఒక చక్కని దూతయై నిలువబడెను. అంత నా పిల్ల మర్యాదగా నిలుచుండి దేవునికి స్తోత్రములు చెల్లించెను. ఈ దైవదూత ఈ బంగారమ్మ సుగుణములను మెచ్చి అమ్మా! ఈ దినము దేవుడు నిన్ను దీవించను పంపియున్నాడు. ఇది మొదలుకొని నీవు పలికిన ప్రతి మాటకు ఒక బంగారపుకడ్డీ నీ నోటినుండి పడును అని దీవించెను. ఈ పిల్ల దూతకు వందనములు చెప్పి నీటిబిందె చేతబూని ఇంటికిబోగా తల్లియు బిడ్డయు చాలా కోపపడి తిట్టిరి. ఆ పిల్ల కొంతసేపటికి జరిగిన చరిత్ర చెప్పుటకు నోరు తెరవగా నోటినుండి బంగారపుకడ్డీ పడెను. ఈ తల్లి తిట్టుట మాని బంగారము దొరికినదను ఆశతో అది యెట్లు జరిగినది, నీ నోటిలో ఏమియున్నది? అని బ్రతిమాలి అడిగి చెప్పించుకొని సొంతబిడ్డకు మంచి నగలువేసి మంచి పట్టుబట్టలుకట్టి బావికి నీళ్లకుపంపెను. అక్కడ ఒక ముసలమ్మ కూర్చుండి నీళ్లు అడుగగా ఆ పిల్ల చాలా కోపముతో ఛీ నీవంటి బీద

ముసలిదానికి నేను నీళ్లు పోయవలదయినా అని చెప్పి పోయక పోయెను. మరికొంత సేపటికి ఈ ముసలమ్మ కాలిచెప్పు పోయి నది వెలికిపెట్టుమని బ్రతిమాలినను లేక చాలా కోపముతో నీవంటి నీచురాలి కాలిచెప్పును నేముట్టవలెనాయని బడాయి చెప్పుచుండగా ఈ ముసలిది చక్కనిదూతయై నిలువబడి అమ్మాయీ! ఈ దినము దేవుడు నీకు శాపము పంపియున్నాడు నీవు మాట్లాడునప్పుడు నోటిలోగుండా తేళ్లు పాములు పడునని చెప్పగా ఆ పిల్ల భయముతో ఇంటికిపోయి ఎవరితో కొంతసేపు మాటలాడకయుండి తల్లితో యీ వృత్తాంతము చెప్పుటకు నోరు తెరువగా పెద్ద పాముపడెను. తల్లియు తండ్రియు భయపడి చాలా దుఃఖముపాలైరి.

ఒకరికి కీడు చేయతలంచితిమా కీడు మనకు చుట్టుకొనును.

నా ప్రియ చిన్నపిల్లలారా! మీరు ఈ యిద్దరిలో ఎవరివలె యుండగోరెదరు? ఏది మంచిదో తెలిసికొని యుక్తమైనదానిని పట్టుడి.



# చెట్లను గురించి పాట



మ్రాకులే మహోప - కారములు బాలిక
మ్రాకు యెండతాకకుండ - మనుచు హాయిగా

2. కల, కల, కల పక్షులెల్ల - కలసికూయుగా
చెలగియాలకింప మనసు - కలతమాయగా

3. కాయపండ్లుకట్టె - కలపసాయమలవుగా
జేయునెపుడు మానవులకు - చెట్లెకలవుగా.

# బాబుచేసిన సహాయము

“అయ్యయ్యో! బాబు ఉంటే ఎంత బాగుండును. ఇప్పుడు నా అద్దాలెవరు తెచ్చిపెట్టుతారు. వాడను, నా అద్దాలుగాక ఇక నాకు కండ్లెక్కడివి?” అనుకొనుచు అవ్వ ముందు రెండుమూడు పుస్తకాలను, కుట్టుబుట్టను పెట్టుకొని కూర్చుండియుండెను.

“అవ్వా! ఏంకావాలి. అద్దాలా? నేంతెస్తాలే” అని అంటూ నొక ముద్దు బాలుడు దడబడ లోనికి పరుగెత్తెను.

“అమ్మా! అమ్మా, అవ్వఅద్దాలెక్కడే. ఇప్పుడే కావాలంటుంది.”

“అవిగోరా! ఆ బల్లమీద చూడు”

బాబు వాటిని పట్టుకొని వెనుకకు తిరిగెను. గాలి వాటిపై అతనికళ్లు పడగానే బిత్తరపోయెను.

“అమ్మా! అవ్వ అద్దాలుపగిలినవే”

“మీనాయన పుస్తకము వాటిమీద పెట్టినాడు కాబోలు. కొత్తవి తెస్తాడులే”

అవ్వ యొద్దకు బోవునపుడు వానికి కండ్లనిండ నీళ్లువచ్చెను. అవ్వ ఇప్పుడేమి చేయును? ఎట్లా చదువగలదు? ఎట్లా కుట్టగలదు? అని వాడనుకొనెను. కొంచెము సేపటిలో వాని ముఖము వికసించెను. అప్పుడప్పుడు అవ్వ “బాబూ! నువ్వేరా నా కాళ్లూ. చేతులూ. నువ్వులేకపోతే నేనేమి చేయలేనా” అనేది. ఇకమీదట ఆమెకు కాళ్లూ చేతులు మాత్రమేగాక కండ్లుగా కూడా ఉంటానని పరుగెత్తుకొనిపోయి, “అవ్వా! నీ అద్దాలు పగిలిపోయినవి, గాని నేను నీకిక కండ్లుగా ఉంటాను. సరేనా?” అని యడిగెను. అవ్వ చాల సంతోషించి వానిని ముద్దుబెట్టుకొని “నాయనా! నీవు మంచివాడవు” అనెను.



# విత్తనము లెట్లు కలుగుచున్నవి?

ఏదైన ఒక పుష్పము తెచ్చి ముందుపెట్టుకొనుము.

ఈ పుష్పముచుట్టు బహు మనోహరముగా కనబడుచున్న ఆకులను చూడుము. వానికి పుష్పదళములని పేరు. వాటి రంగేది? కొన్ని మొక్కల పుష్పములకు పుష్పదళములుండవు. పుష్పము మధ్యభాగమున ఏమున్నది? కొన్ని కాడలవంటివి కుచ్చులాగున నున్నవి. వాటిచివరను సంచులవంటివి పసుపు పొడితో నిండియున్నవి. వీనికి కేసరములనియు, ఆ పొడికి పుష్పరజమనియు పేర్లు. వీటికిమధ్య కీలమని పొడుగు కాడ ఒకటి గలదు. కొన్ని పుష్పములకు రెండు నుండును. దీనికి తిత్తి వంటిదిలేదు. ఇదెందుకు! ఈ కీలముకు క్రింద పుష్పము అంటి యున్న విత్తనముల గిన్నె కలదు. దీనిలోపల చిన్నచిన్న ఆకు పచ్చ గింజలున్నవి. పుష్పరజము (పుప్పొడి) ఈ కీలాగ్రమున పడి క్రిందనున్న సంచిలోని గింజలయొద్దకు గొనిపోవును. అంతట అవి ఎదుగనారంభించును. అవి ఉన్నగిన్నెయు పెద్దది

కా నారంభించి ఆగి విత్తనముల పెట్టెయగును. త్వరలోc పుష్పదళములును కేసరములును ఎండి వాడిపోవును.

అన్ని పుష్పములలోని విత్తనములపెట్టెలు ఒక్కటేనా? గుమ్మడిపువ్వులు, చంద్రకాంతపువ్వులను పరిశీలించి చూడుడు. పెద్దచెట్లకు పెద్ద పెద్ద విత్తనపుపెట్టె లుండుటలేదెందుకు? కొన్నిపువ్వుల కంత చక్కని రంగులుండుట ఎందుకు? కొన్నిటికి చక్కని వాసనయేల? అవి తేనెటీగలను, భ్రమరములను ఆకర్షించుటకు, అవి పుప్పొడిని ఒక పువ్వునుండి ఒక పువ్వును గొని పోవును. పువ్వులులేని చెట్లున్నవా? ఉన్నవి. వానికి పర్ణములని పేరు. వాటి పువ్వులను మనము చూడజాలనంత చిన్నవి.

విత్తనములనుచేయుటయే ప్రతిచెట్టుయొక్క ముఖ్యపని యైయున్నది. పువ్వులు విత్తనములపెట్టెలగు కాయలు, విత్తనములను కాపాడు సాధనములై యున్నవి.



# బాలమిత్ర టపా




ప్రియబాలమిత్రులారా!

నేను బాలమిత్రటపాకు ఒక ఉత్తరము వ్రాయవలెనని చాలాకాలమునుండి మిగుల గోరుచుంటిని. అట్టి నాకోరిక నేటికి దేవుడు సఫలపరచినందుకు మిగుల సంతసించుచున్నాడను.

సోదరీ సోదరులారా! ఆదికాలమునందు భక్తాగ్రేసరుడైన మోషేద్వార సైన్యముల యెహోవా మన కొసంగినట్టి పది ఆజ్ఞలలో "అబద్ధమాడవద్దు" అనునది ఒక ఆజ్ఞయైయున్నది అది యెల్లరకు తెలిసిన విషయము ఐనను, దీనిని మీరుట దక్కిన పాపములకంటె గొప్పది కాదనియో, లేక, మరియే కారణముననో, బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యములను నాలుగవస్థలలో నుండువారును తరచుగా నీయాజ్ఞను మీరుచున్నారు. గావున, దొంగతనముకంటె నబద్ధమాడుట గొప్ప పాపమైయున్నదని అబద్ధమాడువారు గ్రహించుటకై యిచట నొక యాంగ్లేయ బాలికయొక్క యభిప్రాయమును క్లుప్తముగా పొందుపరచుచున్నాడను.

"కొన్ని యేండ్లకుముం దింగ్లాండు దేశములో నైదేండ్ల యీడుగలిగిన యొక బాలిక యొకనాటిరాత్రి తన పడకగదిలో నిద్రించుచుండి తెల్లవారుజామున 4 ఘంటలకు లేచి రాత్రి ధరించిన బట్టలతోడనే తల్లిచెంతకుబోయి, అమ్మా! అమ్మా! యని పిలువగా, ఆ బిడ్డయొక్క తల్లి, ఏమమ్మాయీ! యింకను రాత్రియున్నదే. మఱొకగంట పరుండి నిద్రపోరాదా యని మాటపలికెనట. అపుడా బాలిక, లేదమ్మా నిన్నొక

సంగతి యడుగవచ్చినాను. ఇట్లు రాకమ్మా యని పిలువగా, ఆయమ్మ వెలికివచ్చి, "ఏమికావలెనమ్మా" యని యడుగగా, ఆ బిడ్డ తల్లిని గూర్చుండమనిచెప్పి అమ్మా! దొంగతనము చేయుట గొప్ప పాపమా? అబద్ధమాడుట గొప్ప పాపమా? చెప్పుమని తల్లిని ప్రశ్నవేసెను. తల్లి యా మాట లాలకించి కొంతసేపూరకుండి, "అమ్మా! రెండును సమానమే" యని చెప్పెనట, అందుకాబాలిక, కాదు నే చెప్పెద వినుము అని తల్లినిజూచి "అమ్మా! నీయొద్దనుండి దేనినైనను దొంగిలించి నట్టయిన, అది నీవు చూచినను, లేక నాకు బశ్చాత్తాపము గలిగినను, దానిని తిరిగి నీ కియ్యగలను. కాని, ఏదైన ఒక సంగతి విషయమై యబద్ధమాడినయెడల, దాని నెట్లుచెల్లింప గలను? కనుక, దొంగిలించుటకంటె యబద్ధమాడుట గొప్ప పాపమైయున్నది" అని చెప్పెనట. అపుడాతల్లి బిడ్డను కౌగలించుకొని, ముద్దుపెట్టుకొని, తన పడకగదికి సాగనంపి, యా విషయమై యాలోచింపగా, ఆ బాలిక చెప్పినదే సత్యముగా తోచెనట. కనుక దీనిని చదువునట్టి బాలములులారా! దొంగతనముకంటె నబద్ధమాడుట గొప్ప పాపమని యిది వరకు తలంపకుందురేని, ఇప్పుడది గొప్ప పాపమనితలంచుడి.

ఈ బాలిక చెప్పినది సత్యమే. మనము దేవుని యొక్క దశమ భాగములు దొంగిలించినను, ఒకానొకప్పుడు చెల్లింపగలము గాని, అబద్ధమాడిన యెడల దాని నెట్లు చెల్లింపగలము?

అబద్ధమాడుట చేతనే కదా, అననీయ, సప్పీర లంతమొందిరి. గేహాజీ కుష్ఠరోగియాయెను. అపొ. కార్య. 5: 10; 2 రాజులు 5: 25—27.

"అబద్ధమాడు పెదవులు యెహోవాకు అసహ్యములు." సామె 12: 17, 19, 22.

ఇట్లు

మీ ప్రియ బాలమిత్రుడు

యస్. యోహాను

అమలాపురము

గోదావరి జిల్లా

C. L. S. PRESS, MADRAS—1918